



రచయిత : శ్రీ పంతుల వెంకట రాధాకృష్ణ


భార్య : శ్రీమతి పంతుల జయ మహేశ్వరి

కుమారులు : పంతుల వెంకట లలిత శ్రీకర్

పంతుల వెంకట గౌరీ సుధీర్

See My 4 Blogs :

http://jayaparakri.blogspot.in

http://teluguteachers-parakri.blogspot.in,

http://parakrijaya-parakri.blogspot.in/,

http://medhadakshinamurtyjyotishanilayam.blogspot.in,

Like FB page : https://www.facebook.com/SRIMEDHADAKSHINAMURTYJYOTISHANILAYAM

శ్రీ మేధాదక్షిణామూర్తి జ్యోతిషనిలయం

# పరాక్రి తెలుగు వ్యాకరణం



హైస్కూలు విద్యార్థుల కొరకు

FOR HIGH SCHOOL STUDENTS

PARAKRI

# TELUGU GRAMMAR




సంకలనం : పంతుల వెంకట రాధాకృష్ణ

సెల్ ; 9966455872 - parakrijaya@gmail.com

పద్య లక్షణాలను తెలిపే శాస్త్రాన్ని చంధస్సు శాస్త్రం అంటారు. పద్య పాదము నందలి అక్షరాలను లఘు, గురువులతో విభజించి గణాల ఆధారంగా చంధో లక్షణములను వివరించుట జరుగును. ఏక మాత్ర కాలము పలుకునవి లఘువులు, ద్విమాత్ర కాలము ఉచ్ఛరింపబడే అక్షరాలు గురువులు.

**గురు సంజ్ఞ "U" (గుర్తు) లక్షణములు:**

1. దీర్ఘాక్షరములన్నియు గురువులు ఉదా:- ఆ,చ,క,ఔ,ఐ మొIIనవి
2. నిండుసున్నతో కూడిన అక్షరములు గురువులు ఉదా:-అం,కం,రం, చం మొIIనవి
3. విసర్గముతో కూడిన అక్షరములు గురువులు ఉదా: అః, దుః, పః మొIIనవి.
4. పొల్లుహల్లుతో కూడిన అక్షరములు గురువులు. ఉదా: నిన్,మన్,లన్ మొIIనవి.
5. సంయుక్తాక్షరములకు ముందున్న అక్షరములు మరియు దిత్వాక్షరములకు ముందున్న అక్షరములు గురువులు. ఉదా: కావ్య, శిల్ప, అత్త, అమ్మ మొIIనవి.

**లఘు సంజ్ఞ "I" (గుర్తు) లక్షణములు:**

1. హ్రస్వాక్షరములన్నియు లఘువులు
2. వట్రసుడితో కూడిన వర్ణములు లఘువులు. ఉదా: కృషి, మృణాళిని, తృణము మొIIనవి
3. రెండు వేరు వేరు పదములైనప్పుడు రకారము (ర వత్తు "్ర") ఊది పలకదు కావున లఘువని గుర్తింపుడు ఉదా: నీవు క్రమముగా అనునప్పుడు ఊది పలకదు. కావున లఘువు అగును. సక్రమముగా అనునప్పుడు "స" అను అక్షరము గురువగును.

గణములు:- గురు లఘువులతో కూడిన అక్షరసముదాయమును గణములు అందురు.

1. ఏకాక్షర గణములు :- ఒకే అక్షరము గణముగా గుర్తింపబడి యుండును.

| I | U |
|---|---|
| అ | లా |

2. ద్యక్షర గణములు:- అనగా రెండు అక్షరములతో ఏర్పడు గణములు. ఇవి4.

| | | |
|---|---|---|
| గగము లేదా గా గణము | U U | ఉదా:- రామా |
| లగము లేదా వ గణము | I U | ఉదా:- రమా |
| గలము లేదా హ గణము | U I | ఉదా:- రామ |
| లలము లేదా లా గణము | I I | ఉదా:- రమ |

3. త్ర్యక్షర గణములు:- అనగా మూడు అక్షరములతో ఏర్పడు గణములు. ఇవి8.

| | |
|---|---|
| U U U | మ గణము |
| I U U | య గణము |
| U I U | ర గణము |
| I I U | స గణము |
| U U I | త గణము |
| I U I | జ గణము |
| U I I | భ గణము |
| I I I | న గణము |



**4.** చతురక్షర గణములు:- అనగా నాలుగు అక్షరములతో ఏర్పడు గణములు. ఇవి **16.**

| | | | |
|---|---|---|---|
| U U U U | మగ గణము | U U U I | మల గణము |
| I U U U | యగ గణము | I U U I | యల గణము |
| U I U U | రగ గణము | U I U I | రల గణము |
| I I U U | సగ గణము | I I U I | సల గణము |
| U U I U | తగ గణము | U U I I | తల గణము |
| I U I U | జగ గణము | I U I I | జల గణము |
| U I I U | భగ గణము | U I I I | భల గణము |
| I I I U | నగ గణము | I I I I | నల గణము |

ఇంద్ర గణములు ఆరు:

నల గణము – I I I I

నగ గణము – I I I U

సల గణము – I I U I

భ గణము – U I I

ర గణము – U I U

త గణము – U U I




సూర్య గణములు రెండు:

న గణము – I I I హ గణము – U I

యతిస్థానము: పద్య పాదంలోని మొదటి అక్షరాన్ని వళి, విశ్రాంతి, విరామం, విరతి, యతి అని అంటారు. పద్యపాదంలోని మొదటి అక్షరానికి సంబంధించిన అక్షరం అదే పాదంలో నిర్ణీత స్థానంలో ఉంటే యతిమైత్రి అంటారు.న్

యతిమైత్రి గల అక్షరాలు:

1. అ,ఆ,ఐ,ఔ,య,హ
2. ఇ,ఈ,ఋ,ౠ,ఎ,ఏ
3. ఉ,ఊ,ఒ,ఓ
4. క,ఖ,గ,ఘ
5. చ,ఛ,జ,ఝ,శ,ష,స
6. ట,ఠ,డ,ఢ
7. త,థ,ద,ధ,
8. ప,ఫ,బ,భ
9. పు,ఫు,బు,భు,ము, ఫొ,ఫో,బొ,భో,మొ,మో
10. ర–ఱ,–ల–ళ,–ల–డ, న–ణ

ఇవి గాక కొన్ని పత్యేక యతులు కూడా కలవు.ప్రాస యతి అనునది ముఖ్యముగా గీత పద్యములందు వచ్చును. గ్రహింపుడు.

ప్రాసనియమము: పద్యములోని ప్రతిపాదమునందున్న రెండవ అక్షరము ప్రాసాక్షరము. పద్యములోని అన్ని పాదాలలో రెండవ అక్షరము ఒకే హల్లునకు సంబంధించిన అక్షరము ఉంటే దానిని ప్రాసనియమము అంటారు.

పద్యములలో రకాలు:– 1. వృత్తములు 2. జాతులు 3. ఉపజాతులు

I. ఉత్పలమాల : వృత్తములకు చెందిన పద్యము.

1. దీనియందు నాలుగు పాదాలుండును.
2. ప్రతి పాదమునకు 20 అక్షరాలుండును.
3. ప్రతి పాదమునకు భ,ర,న,భ,భ,ర,వ అను గణాలుండును.
4. 1-10 అక్షరములకు యతిమైత్రి ఉండును.
5. ప్రాసనియమం కలదు.

| U I I | U I U | I I I | U I I | U I I | U I U | I U |
|---|---|---|---|---|---|---|
| లాలల | లాలలా | లలల | లాలల | లాలల | లాలలా | లలా |
| | | | | | | |

II. చంపకమాల : వృత్తములకు చెందిన పద్యము.

1. దీనియందు నాలుగు పాదాలుండును.
2. ప్రతిపాదమునకు 21 అక్షరాలుండును.
3. ప్రతిపాదమునకు న.జ,భ,జ,జ,జ.ర అనుగణాలు ఉండును.
4. 1-11 అక్షరాలకు యతిమైత్రి ఉండును.
5. ప్రాసనియమం కలదు.

| I I I | I U I | U I I | I U I | I U I | I U I | U I U |
|---|---|---|---|---|---|---|
| ననన | నానా న | నానన | ననాన | ననాన | ననాన | నాననా |
| | | | | | | |

III. శార్దూలము : వృత్తములకు చెందిన పద్యము.

1. దీనియందు నాలుగు పాదాలుండును.
2. ప్రతి పాదమునకు 19 అక్షరాలుండును.
3. ప్రతి పాదమునకు మ,స,జ,స,త,త,గ అనుగణాలుండును.
4. 1-13 అక్షరములకు యతిమైత్రి ఉండును.
5. ప్రాసనియమం ఉండును.

| U U U | I I U | I U I | I I U | U U I | U U I | U |
|---|---|---|---|---|---|---|
| నానానా | ననవా | ననాన | ననవా | నానాన | నానాన | నా |
| | | | | | | |

IV. మత్తేభం : వృత్తములకు చెందిన పద్యము.

1. దీనియందు నాలుగు పాదాలుండును.
2. ప్రతిపాదమునకు 20 అక్షరాలుండును.
3. ప్రతిపాదమునకు స,భ,ర,న,మ,య,వ అనుగణాలు ఉండును.
4. 1-14 అక్షరాలకు యతిమైత్రి ఉండును.
5. ప్రాసనియమం కలదు.

| I I U | U I I | U I U | I I I | U U U | I U U | I U |
|---|---|---|---|---|---|---|
| లలలా | లాలల | లాలలా | లలల | లాలాలా | లలాలా | లలా |
| | | | | | | |

**III.** కందము : తెలుగు జాతి పద్యము.

1. కందమునకు నాలుగు పాదములుండును.
2. మొదటి పాదమున మూడు గణములు, రెండవ పాదమున ఐదు గణములుండును.
3. అవి నల,గగ,భ,జ,స గణములలో ఏపైనా కావచ్చును.
4. ఇందులో మొదటి రెండు పాదములకుపూర్వార్ధమనియు , మూడు నాలుగు పాదములకు ఉత్తరార్ధమనియు పేరు.
5. 1-3 పాదములందు యతి ఉండదు. 2-4 పాదములందు ఏడవ గణ మొదటి అక్షరముతో యతి చెల్లును.
6. పాదములందు బేసి సంఖ్యలో జగణము పనికి రాదు.
7. 6 వ గణము జగణము గాని నలము గాని యై ఉండవలెను.
8. మొదటి పాదాక్షరము గురుపైన గురువు , లఘుపైన లఘువు అన్ని పాదముల మొదటి అక్షరమై ఉండవలెను.
9. ప్రాసనియమము అన్ని పాదములకు యుండును.
10. విశేషించి ఎనిమిదవ గణము గా గణము గాని స గణము గాని అయి ఉండునని గ్రహింపవలెను.

క్రింది రేఖా చిత్రమును గమనింపుము.

కం॥ ______3________
______5________________
______3_______
______5________________

కం॥ కందము త్రిసర గణంబుల
నందును గాభజ సనలము లైదును గణముల్ ।
పొందును నారిట నలజము
లొందు తుదిగురువు జగణ మొప్పదు బేసిన్ ॥

**I.** ఆటవెలది : తెలుగు ఉపజాతి పద్యము.

1. మొదటి పాదమున మూడు సూర్య గణములు రెండు ఇంద్ర గణములుండును.
2. రెండవ పాదమున ఐదు సూర్యగణములే యుండును.
3. అట్లే మూడు నాలుగు పాదములని గ్రహింపుడు.
4. ప్రతి పాదమునందును నాల్గవ గణ మొదటి అక్షరముతో యతి చెల్లును.
5. విశేషించి ప్రాసయతి కూడా యుండును. ప్రాసనియమం ఉండదు.

క్రింది రేఖా చిత్రమును గమనింపుము.

ఆ॥వె॥ ________________3+2_____________
________________5_____________
_ఇనగణ త్రయంబు__3+2__ఇంద్రద్వయంబు___
__హంసపంచకంబు_____5___ఆటవెలది____

**II.** **తేటగీతి:** తెలుగు ఉపజాతి పద్యము.

1. మొదటి పాదమున ఒక సూర్యగణం రెండు ఇంద్రగణములు మరలా రెండు సూర్య గణములు మొత్తము ఐదు గణములుండును.అట్లే మూడు నాలుగు పాదములు కూడా.
2. ప్రతి పాదమునందును నాల్గవ గణ మొదటి అక్షరముతో యతి చెల్లును.
3. ప్రాసయతి చెల్లును. ప్రాసనియమము లేదు.

క్రింది రేఖా చిత్రమును గమనింపుము.

తే॥గీ॥ ------------**1+2+2**--------------

------------**1+2+2**---------------

_____________**1+2+2**_______________

సూర్యునొక్కనిపై సుర రాజులిద్దరు దినకరద్వయముతేటగీతి ॥

**III.** **సీసము:** తెలుగు ఉపజాతి పద్యము.

1. ప్రతి పాదమునందును ఆరేసి ఇంద్ర గణములు రెండు సూర్యగణములు ఉండవలెను.
2. ఇది నాలుగు పాదములే అయినను విభజించి చూపుటలో ఎనిమిది భాగములుగా అగుపించును.
3. మొదటి గణ మొదటి అక్షరమునకు తృతీయ గణ మొదటి అక్షరమునకు అట్లే ఒకే పాదమున ఐదవ గణ మొదటి అక్షరమునకు ఏడవ గణ మొదటి అక్షరమునకు యతి చెల్లును. అనగా ఒక పాదమున రెండు యతులుండును.
4. ఈ విధముగా నాలుగు పాదములు ముగిసిన పిమ్మట ఆటవెలదిని గాని తేటగీతిని గాని చెప్పవలెను.
5. ఈ పద్యమున కూడా ప్రాసయతి చెల్లును. ప్రాసనీమము యుండును.
6. ఎనిమిది పాదములుగాగల ఈ మొత్తమునకు సీసమని పేరు.

క్రింది రేఖా చిత్రమును గమనింపుము.

సీ॥ ----**2**ఇం----+---**2**ఇం-----

----**2**ఇం---+---**2**సూ----

----**2**ఇం----+---**2**ఇం-----

----**2**ఇం---+---**2**సూ----

----**2**ఇం----+---**2**ఇం-----

-----**2**ఇం---+---**2**సూ----

----**2**ఇం----+---**2**ఇం-----

-----**2**ఇం---+---**2**సూ----

గీ॥ --------------------

--------------------

--------------------

--------------------

ఉపోద్ఘాతము:- శరీర అందమునకు అలంకరణములు ఉన్నట్లే పద్యముల సొబగునకు ,సొగసునకు కావ్యములు ఆలంకార ఘటితముగా వ్రాయబడినవి.సంసృతమున "ఆలం" అను ధాతువునకు ఇంతకంటే ఎక్కువ అందముగా చూపుటకు వీలు లేనిది అని అర్థం. అందాన్ని పెంచే ప్రక్రియ ఆలంకారమైనప్పుడు భాషా యోషకు కూడా ఇవి ఆలంకరింపబడినవి. అవి

**1. శబ్దాలంకారములు 2. అర్థాలంకారములు**

శబ్ధాలంకారములు: - శబ్ధము ప్రధానంగా గల అలంకారములు శబ్ధాలంకారములు అందురు. ఇవి ప్రధానముగా మూడు విధములు.

**1.అనుప్రాసము 2.యమకము 3.ముక్తపదగ్రస్తము**

1. అనుప్రాసము :- ఒక అక్షరము గాని లేక అక్షరసముదాయము గాని , పదముగాని మరల మరల వచ్చిన అనుప్రాసములు అందురు. ఇవి నాలుగు విధములు 1. వృత్త్యనుప్రాసము 2. ఛేకాను ప్రాసము 3.లాటానుప్రాస 4. అంత్యాను ప్రాస

1. వృత్త్యనుప్రాస:- ఒకటిగాని అంతకంటే ఎక్కువగాని హల్లులు ఆవృతమైతే (పునరావృతమైతే) అనగా మరల మరల వచ్చినట్లైతే దానిని వృత్త్యాను ప్రాసాలంకారము అంటారు.

ఉదా: 1. అ జెట్టీ మట్టీ తొట్టి లో బిట్టి బిగుసుకుంది.

2. నిన్న మా అన్నకొన్న పెన్ను మానాన్న కొన్నపెన్ను కన్నా మిన్న.

2.ఛేకాను ప్రాస :-అర్థభేధము కలిగిన పదాలు వ్యవధానము లేకుండా ప్రయోగింపబడితేఅది ఛేకానుప్రాసాలంకారముఅగును.

ఉదా: 1.కందర్ప దర్ప సంహరుడు హరుడు.

2.కాయ నికాయ గాయముల కాంతలు

3.లాటానుప్రాస:- అర్థ బేధము లేక తాత్పర్యబేధము కలుగునట్లు వెంటవెంటనే ప్రయోగింప బడు పదములను లాటాను ప్రాసమందురు.

ఉదా: 1.శ్రీనాథు వర్ణించు జిహ్వ జిహ్వ

4.అంత్యానుప్రాసము:- ఒక పదముచివరగాని పాదముల చివర గాని వాక్యముల చివర గాని ప్రాస పాటించినట్లైతే అది అంత్యానుప్రాసాలంకారము.

ఉదా: హారతి పళ్ళెం - తలుపు గొళ్ళెం - గుర్రపు కళ్ళెం

2. యమకాలంకారము:- ఒకే అక్షరాల సమూహము అర్థబేధం తో ప్రయోగింప బడితే అది యమకాలంకారము

ఉదా: 1.మనసు కవి మనసుకవి అత్రేయ

2.కం॥ రామా నినుపూజింపగ
రామా! భద్రాద్రిలోనే రంజిల దగునా
రా - మా కోర్కెలు దీర్పగా
రామా నీ నామమెంత రమ్యముదండ్రీ ॥



**3.** ముక్తపద గ్రస్తాలంకారము :– విడిచి పెట్టబడీన పదమును మరల గ్రహించి ప్రయోగించిన అది ముక్తపద గ్రస్తాలంకారము

ఉదా: గోదారి గట్టుంది
గట్టు మీద చెట్టుంది
చెట్టు కొమ్మన పిట్టుంది
పిట్ట మనసులో ఏముంది.

## అర్థాలంకారములు

**1.** ఉపమాలంకారము:– ఉపమాన ఉపమేయములకు మనోహరమగు సాదృశ్యమును వర్ణించి చెప్పిన ఉపమాలంకారము అందురు. ఇందు నాలుగు అంగములు ఉండును.

**1.**ఉపమేయము**2.**ఉపమానము.**3.**ఉపమావాచకము**4.**సమానధర్మము

ఉదా: రాజు యుద్ధము నందు సింహము వలే పోరాడెను.

వివరణ: ఉపమేయము --- రాజు
ఉపమానము---- సింహము
ఉపమవాచకము ---- పోలికను తెలిపే పదము (వలే ,ఓలే, అలా, రీతి,భంగి)
సమాన ధర్మము : -------- పోరాడుట

**2.** రూపకాలంకారము:– ఉపమేయము నందు ఉపమాన ధర్మాన్ని ఆరోపించి చెప్పుటను రూపకాలంకారము అందురు.

ఉదా: వీరుడగు రాజసింహునకు యుద్ధమున ఎదురులేదు.
సింహము యొక్క పరాక్రమ భావన రాజుపై ఆరోపించబడినది.

**3.** ఉత్ప్రేక్షాలంకారము:– ఊహ ఉత్ప్రేక్ష అనబడును.ఉపమాన ధర్మ సంబంధ ముచే ఉపమేయమును ఉపమానముగా ఊహించి చెప్పుటను ఉత్ప్రేక్షా లంకారము అందురు.

ఉదా: ఆ ఏనుగు నడగొండయా అనునట్లు ఉన్నది.

వివరణ: ఉపమేయము: కొండ , ఉపమానము : ఏనుగు
ఏనుగు నడిచే కొండలా ఉందని ఊహించడం జరిగింది.

**4.** అర్థాంతరన్యాసాలంకారము:– సామాన్యాన్ని విశేషం చేత గాని, విశేషాన్ని సామాన్యం చేతగాని సమర్థించి చెప్పిన అర్థాంతరన్యాసాలంకారము అగును.

ఉదా:ఆంజనేయుడు లంకకు లంఘించేను.మహాత్ములకు చేయలేని పనిలేదు కదా!

వివరణ: ఇచ్చట మొదటి వాక్యము విశేషము . రెండవది సామాన్యము. సమర్థింప బడినది గావున ఇది అర్థాంతరన్యాసాలంకారమైనది.

**5.** అతిశయోక్తి అలంకారం:– ఉన్న వస్తువును ఉన్నదాని కంటే ఎక్కువ చేసి చెప్పుట. ఇట్లు అతిశయించి చెప్పుటచే ఈ అలంకారమైనది.

ఉదా: ఆ నగర మందలి సేలలు ఆకాశమును అంటుచున్నవి.

వివరణ : మిక్కిలి ఎత్తుగా ఉన్నవని భావం.

**6.** స్వభావోక్తి అలంకారము:– జాతిగుణ క్రియాదులను ఉన్నది ఉన్నట్లుగా చెప్పుటను స్వభావోక్తి అలంకారము అందురు.

ఉదా: ఆవనమందలి లేడ్లు చెవులు నిక్కించి పరుగిడినవి.

వివరణ: ఉన్నది ఉన్నట్లుగా చెప్పబడినది.

ఉదా: ఆవనమందలి లేడ్లు చెవులు నిక్కించి పరుగిడినవి.

వివరణ: ఉన్నది ఉన్నట్లుగా చెప్పబడినది.

7. **శ్లేషాలంకారము:-** నానార్థములనిచ్చు పదములను ఉపయోగించి వేరువేరు భావములను కల్గించినచో అది శ్లేషాలంకారము.

ఉదా: రాజు కువలయానందకరుడు

వివరణ: "రాజు" అను శబ్దమునకు చంద్రుడు – ప్రభువు అని రెండు అర్థము లున్నవి. అట్లే కువలయము అనగా భూమి–కలువ అని రెండర్థములున్నవి.ఇచ్చట చంద్రుడు కలువలకు , ప్రభువు భూమికి అనగా ప్రజలకు ఆనందము లేదా సంతోషమును కలుగజేయును.

8. **దృష్టాంతాలంకారం:-** ఉపమాన వాక్యాలయొక్క వేరు వేరు ధర్మాలను బింబ ప్రతిబింబ భావంతో వర్ణించి చెప్తే దృష్టాంతాలంకారం.

ఉదా: రాజా నీవే కీర్తిమంతుడవు. చంద్రుడే కాంతి మంతుడు.

వివరణ: రాజు చంద్రుడుని మధ్య బింబ ప్రతిబింబ భావము వర్ణింపబడినది.

## భాషా భాగములు

| భాషాభాగం | వివరణ | ఉదాహరణ |
|---|---|---|
| ౧.నామవాచకము | పేరును తెలియజేయునది | రవి |
| ౨.సర్వనామము | నామవాచకమునకుబదులుగావాడేది. | మేము |
| ౩.విశేషణము | నామవాచక గుణమును తెలిపేది. | నల్లని |
| ౪.క్రియ | కర్త చేయు పనిని తెలుపును. | చదివితిని |
| ౫.అవ్యయము | లింగ,వచన,పురుషవిభక్తులచే మార్పు చెందని పదములు | ఆహా! |

## వర్ణవిభాగం

| పదం | వివరణ | ఉదాహరణ |
|---|---|---|
| అచ్చులు | ప్రాణములు,స్వరములు అందురు.ఇవి 16. | అ–ఆ–ఇ–ఈ–ఉ–ఊ–ఋ–ౠ–ఎ–ఏ–ఐ–ఒ–ఓ–ఔ |
| హల్లులు | అచ్చుల సహాయముతో పలుకబడు వ్యంజనములు | మొత్తం 36. |
| పరుషములు | కఠినముగా ఉచ్ఛరింపబడినవి. | క–చ–ట–త–ప |
| సరళములు | తేలికగా ఉచ్ఛరింపబడినవి. | గ–జ–డ–ద–బ |
| అనునాసికములు | ముక్కుతో పలుకబడునవి. | ఙ–ఞ–ణ–న–మ |
| స్థిరములు | పరుష ,సరళములు కాని ఇతరములైన హల్లు లన్నియు స్థిరములు. | ఖ–ఛ–ఠ–థ–ధ–ఫ–ఘ–ఝ–ఢ–భ–య–ర–ల–ళ–వ–శ–ష–స–హ |
| ఉభయాక్షరములు | స్వయం పలుకబడి లేనివి | ఁ ం ః |

## విభక్తి ప్రత్యయాలు

| విభక్తులు | ప్రత్యయములు |
|---|---|
| డు,ము,వు,లు | ప్రథమా విభక్తి |
| నిన్,నున్,లన్,కూర్చి,గురించి | ద్వితీయా విభక్తి |
| చేతన్,చేన్,తోడన్,తోన్ | తృతీయా విభక్తి |
| కొఱకున్,కై | చతుర్థీ విభక్తి |
| వలనన్,కంటెన్,పట్టి | పంచమీ విభక్తి |
| కిన్,కున్,యొక్క,లోన్,లోపల | షష్ఠీ విభక్తి |
| అందున్,నన్ | సప్తమీ విభక్తి |
| ఓ, ఓయి,ఓరి, ఓసి | సంబోధన ప్రథమా విభక్తి |

## పద విభజన

| | | |
|---|---|---|
| తత్సమం ప్రకృతి | సంస్కృత ,– ప్రాకృత శబ్దములతో సమానమైనది. | రామః – రాముడు<br>అగ్నీ – అగ్ని |
| తద్భవం వికృతి | సంస్కృత ,– ప్రాకృత భాషల నుండి పుట్టినది. | అజ్ఞ – అన<br>అచ్చేరము – అచ్చెరవు |
| దేశ్యం | తెలుగున వాడుక పదాలు | ఊరు – పేరు– కోట |
| గ్రామ్యం | వ్యాకరణ విరుద్ధమైన భాష | వస్తాడు – తెస్తాడు |
| ద్రుత ప్రకృతికం | ద్రుతం (నకారం ) చివరగల పదం | రామునిన్ – చేసితిని |
| కళ | ద్రుతం చివర లేని పదం | రాముడు, గోవు |

## సమాస విభాగం

| సమాసం పేరు | వివరణ | సమాసపదం | విగ్రహ వాక్యం |
|---|---|---|---|
| తత్పురుషములు(8) | ఉత్తరపదప్రధానం | రాజభటుడు | ఎవరి యొక్క భటుడు? |
| ప్రథమా తత్పురుష | ప్రథమావిభక్తిలో - ము | అర్థరాత్రి | రాత్రి అర్థ భాగము |
| ద్వితీయా ॥ | ద్వి. వి.లో– ను వచ్చును | సెలతాల్పు | సెలను తాల్చిన వాడు. |
| తృతీయా ॥ | తృ.వి లో– చేత | రాజపూజితుడు | రాజు చేత పూజితుడు |
| చతుర్థీ ॥ | చ.వి. లో – కొరకు | ధనాశ | ధనము కొరకు ఆశ |
| పంచమీ ॥ | పం.వి లో వలన | దొంగభయము | దొంగ వలన భయము |
| షష్ఠీ ॥ | ష.వి. లో యొక్క | రామ పత్ని | రాముని యొక్క పత్ని |
| సప్తమీ ॥ | స.వి. లో అందు | మాట నేర్పరి | మాట యందు నేర్పరి |
| నఞ తత్పురుష | కానిది,లేనిది,–వచ్చును. | అసత్యము | సత్యము కానిది |

| సమాసం పేరు | వివరణ | సమాసపదం | విగ్రహ వాక్యం |
|---|---|---|---|
| కర్మధారయ సమాసం | విశేషణ విశేష్యముల తోడి సమానాధికరణము | | ఇవి మొత్తం **7** |
| విశేషణ పూర్వపద కర్మధారయ సమాసం | విశేషణము మొదటి పదముగా ఉండును. | వృద్ధ కపోతము | వృద్ధ మైన కపోతము |
| విశేషణ ఉత్తర పద కర్మధారయ సమాసం | విశేషణము రెండవ పదముగా ఉండును. | కపోత వృద్ధము | కపోతము వృద్ధమైనది |
| విశేషణ ఉభయ పద కర్మధారయ సమాసం | రెండు పదములు విశే షణములై ఉండును. | శీతోష్ణములు ఎత్తుపల్లములు | శీతము,–ఉష్ణము ఎత్తు, – పల్లము |
| ఉపమాన పూర్వపద కర్మధారయ సమాసం | ఉపమానము మొదటి పదముగా ఉండును. | మేఘ శ్యాముడు | మేఘము వలే శ్యాముడు |
| ఉపమాన ఉత్తర పద కర్మధారయ సమాసం | ఉపమానము రెండవ పదముగా ఉండును. | పాద పద్మములు | పద్మముల వంటి పాదములు |
| అవధారణ పూర్వపద కర్మధారయ సమాసం | ఇది రూపకసమాసము వస్తుధర్మ ఆరోపణము | కోపాగ్ని | కోపము అనెడి అగ్ని |
| సంభావన పూర్వపద కర్మధారయ సమాసం | సంజ్ఞావాచకముపూర్వ పదమై యుండును | ద్వారకానగరము | ద్వారక అనుపేరు గల నగరము |

| సమాసం పేరు | వివరణ | సమాసపదం | విగ్రహ వాక్యం |
|---|---|---|---|
| అవ్యయీభావ స॥ | పూర్వపదప్రధానం | యథావిధి | విధి ఎట్లో అట్లు |
| ద్విగు సమాసము | సంఖ్యా పూర్వము | నవరాత్రులు | తొమ్మిది రాత్రులు |
| ద్వంద్వ సమాసము | ఉభయపదప్రధానము | తల్లిదండ్రులు | తల్లి తండ్రి |
| బహువ్రీహిసమాసము | అన్య పదప్రధానము | కమలాక్షుడు (విష్ణువు) | కమలమువంటి కన్నులు కలవాడు |

పరికల్పన: పరాక్రి

# సంస్కృత సంధులు

జిల్లాపరిషత్ ఉన్నతపాఠశాల

| సంధి నామము | సంధి కార్యము | విడదీయుట | పదము |
|---|---|---|---|
| సవర్ణదీర్ఘ సంధి | అ–ఇ–ఉ–ఋలకు సవర్ణాచ్చులు పరమైనప్పుడు వాటి దీర్ఘము ఏకాదేశమగును. | రామ+ఆలయము<br>కవి+ఇంద్రుడు<br>భాను+ఉదయము<br>పితృ+ఋణము | రామాలయము<br>కవీంద్రుడు<br>భానూదయము<br>పితౄణము |
| గుణ సంధి | అకారమునకు ఇ–ఉ–ఋలు పరమగునప్పుడు ఏ–ఓ–అర్అను గుణములు ఏకాదేశమగును. | దేవ+ఇంద్రుడు<br>భగ్న+ఉత్సాహము<br>మహ+ఋషి | దేవేంద్రుడు<br>భగ్నోత్సాహము<br>మహర్షి |
| వృద్ధి సంధి | అకారమునకు ఏ–ఐ లు పరమైనప్పుడు ఐకారము ఓ–ఔలు పరమైన ఔకారము వచ్చును. | హిత+ఏషి<br>దివ్య+ఓషధి | హితైషి<br>దివ్యౌషధి |
| యణాదేశ సంధి | ఇ, ఉ, ఋ లకు అసవర్ణ అచ్చులు పరమగు నప్పుడు య్,వ్,ర్ లు ఆదేశమగును. | అతి+ఉగ్రం<br>సు+ఆగతం<br>పితృ+ఆర్జితము | అత్యుగ్రం<br>స్వాగతం<br>పిత్రార్జితము |
| అనునాశిక సంధి | క–చ–ట–త–ప–లకు న,మలు పరమైతే వాటి అనునాశికము వికల్పముగా వచ్చును. | వాక్+మయము<br>తన్+మహిమ | వాఙ్మయం<br>తన్మహిమ |
| విసర్గ సంధి | **1.** విసర్గమునకు సకారము పరమైతే విసర్గ సకారముగా మారును.<br>**2.** హ్రస్వ అకారం మీది విసర్గమునకు అ వర్ణం గాని వర్గ తృతీయ చతుర్థ పంచామక్షారములు గాని హ–య–ప–ర–ల అను అక్షరములు గాని పరమైతే విసర్గకు లోపంవచ్చి ముందున్న హ్రస్వ అకారమునకు ఓకారము ఆదేశమగును.<br>**3.** కొన్ని చోట్ల విసర్గమునకు రేఫము ఆదేశమగును. | తపః+సాధన<br>రక్షః+వల్లభుడు<br>చతుః+భుజుడు | తపస్సాధనం<br>రక్షోల్లభుడు<br>చతుర్భుజుడు |

పరికల్పన: పరాక్రి

# తెలుగు సంధులు

జిల్లా పరిషత్ ఉన్నత పాఠశాల

| సంధి నామము | సంధి కార్యము | విడదీయుట | పదము |
|---|---|---|---|
| అకార (అత్వ) సంధి | అత్తునకు సంధి బహుళము (నిత్యము)<br>(వికల్పము)<br><br>(నిషేధము)<br>(అన్యవిధము) | రామ+అయ్య<br>మేన+అల్లుడు<br><br>అమ్మ+ఇచ్చెను<br>ఒక+ఒక | రామయ్య(నిత్యము)<br>మేనల్లుడు<br>మేనయల్లుడు(వి)<br>అమ్మయిచ్చెను(ని)<br>ఒకానొక(అన్య) |
| ఇకార (ఇత్వ) సంధి | ఏమ్యాదుల ఇత్తునకు సంధివైకల్పికము(వచ్చినది)<br>(రానిది) | ఏమి+అంటివి<br>ఏమి+అంటివి | ఏమంటివి<br>ఏమియంటివి |
| ఉకార(ఉత్వ) సంధి | ఉత్తునకు అచ్చు పరమగునప్పుడు సంధి నిత్యము | రాముడు+అతడు | రాముడతడు |
| రుగాగమ సంధి | **1.** కర్మధారయ సమాసమునందు పేదాది శబ్దములకు ఆలు శబ్దము పరమగునప్పుడు రుగాగమంబగు.<br>**2.** కర్మధారయ సమాసమందు తత్సమ శబ్దమునకుఆలు శబ్దము పరమగునప్పుడు అత్వమునకు ఉత్వమును రుగాగమంబునగు. | పేద+ఆలు<br><br>ధనవంత+ఆలు | పేదరాలు<br><br>ధనవంతురాలు |
| టుగాగమ సంధి | **1.** కర్మధారయ సమాసమునందు ఉత్తునకు అచ్చుపరమగునప్పుడు టుగాగమంబగు.<br>**2.** కర్మధారయ సమాసము నందు పేర్వాది శబ్దములకు అచ్చు పరమగునప్పుడు టుగాగమంబగు | కఱకు+అమ్ము<br><br>పేరు+ఉరము | కఱకుటమ్ము<br><br>పేరుటురము |
| ద్విరుక్త టకార సంధి | కుఱు,చిఱు,కడు,నిడు,శబ్దముల ఱ-డులకు అచ్చుపరమగునప్పుడు ద్విరుక్తటకారమగు | కుఱు+ఉసురు | కుట్టుసురు |
| ఆమ్రేడిత సంధి | ఆమ్రేడితము పరమగునప్పుడు కడాదుల తొలి అచ్చుమీది వర్ణములకెల్ల అదంతంబగు ద్విరుక్తటకారంబగు | కడ+కడ | కట్టకడ |

పరికల్పన: పరాక్రి

# తెలుగు సంధులు

జిల్లా పరిషత్ ఉన్నతపాఠశాల

| సంధి నామము | సంధి కార్యము | విడదీయుట | పదము |
|---|---|---|---|
| గసడదవా దేశ సంధి | 1. ప్రథమము మీది పరుషములకు గసడదవలగు<br>2. ద్వంద్వ సమాసంబున పదంబు మీది పరుషములకు గసడదవలగు. | ఊసు+పోక<br>తల్లి+తండ్రి | ఊసుపోక<br>తల్లిదండ్రులు |
| పుంప్వా దేశ సంధి | కర్మ ధారయ సమాసమందు మువర్ణమునకు పుంపులగు | సరసము+మాట | సరసపుమాట<br>సరసంపుమాట |
| సరళా దేశ సంధి | 1. దృత ప్రకృతికం మీది పరుషములకు సరళములగు<br>2. ఆదేశ సరళములకు ముందున్న దృతంబునకు బిందు సంశ్లేషలు విభాషనగు. | పూచెన్+కలువలు<br>పూచెన్+గలువలు | పూచెన్ గలువలు<br>పూచెం గలువలు<br>పూచెఁ గలువలు |
| త్రిక సంధి | 1. ఆ–ఈ–ఏలకు త్రికములు అని పేరు.<br>2. త్రికంబు మీది అసంయుక్త హల్లునకు ద్విత్వంబు బహుళంబుగానగు<br>3. ద్విత్వాక్షరం పరమగునప్పుడు అచ్చిక దీర్ఘంబునకు హ్రస్వంబగు | ఆ+కన్య<br>ఆ+క్కన్య<br>అ+క్కన్య | అక్కన్య |
| పడ్వాది సంధి | పడ్వాదులు పరమగునప్పుడు మువర్ణమునకు లోప పూర్ణబిందువులు విభాషనగు | భయము+పడు | భయపడు<br>భయంపడు |
| నుగాగమ సంధి | 1. షష్ఠి తత్పురుష సమాసములో ఉకార ఋకారములకు నుగాగమంబగు<br>2. ఉదంతంబైన తధర్మార్థక విశేషణమునకు నుగాగమంబగు<br>3. సమాస ఉదంత స్త్రీ సమములకు పుంపులకు పరుష సరళాలు పరమైన నుగాగమంబగు. | రాజు+ఆజ్ఞ<br>చేయు+అతడు<br>చిగురు+కయిదువు<br>అచ్చుపు+చీకటి | రాజునాజ్ఞ<br>చేయునతడు<br>చిగురుగయిదువు<br>అచ్చుపుంజీకటి |
| ప్రాతాది సంధి | ప్రాతాదుల తొలిఅచ్చు మీద వర్ణంబునకెల్ల లోపంబు బహుళంబుగానగు | లేత+మొగ్గ | లేమొగ్గ |

## క్రియలు : వాక్య - భేదాలు : సంశ్లిష్ట వాక్యానికి సంబంధించినవి

1) క్త్వార్థం : భూతకాలిక అసమాపక క్రియను క్త్వార్థం అంటారు. (క్రియలు "ఇ" కారంతో అంతమవుతాయి).
అన్నం తిని బడికి వెళ్ళాడు (ఏక్రియాపదం) క్త్వార్థం

2) శత్రర్థకం : వర్తమానకాల అసమాపక క్రియ. (క్రియాపదానికి "తూ" చేరుతుంది).
వ్యాసుడు నడుస్తూ కాశీ వెళ్ళాడు (ఏక్రియాపదం) శత్రర్థకం

3) చేదర్థకం : కార్యకారణ సంబంధాన్ని తెలిపే వాక్యాలు చేదర్థకాలు. ("చేత్" అనేప్రత్యయం చేరడం)
చదివితే మార్కులు వస్తాయి (ఏక్రియాపదం) చేదర్థకం

### సంశ్లిష్టవాక్యానికి వివరణ

ఒక ప్రధాన వాక్యము, ఒకటిగాని అంతకంటె ఎక్కువగాని ఉపవాక్యములు కలిగియుండు వాక్యమే సంశ్లిష్టవాక్యం. దీనిలో ప్రధాన వాక్యంలో సమాపక క్రియ, ఉపవాక్యాల్లో అసమాపకక్రియ ఉంటాయి. రెండు సామాన్య వాక్యాలు కలిపి సంశ్లిష్ట వాక్యముగా చేయవచ్చును. అప్పుడు మొదటి వాక్యంలోని క్రియ అసమాపకక్రియ అవుతుంది.

### సామాన్య వాక్యం

దీనిని సంపూర్ణ వాక్యము అని కూడా అంటారు. పూర్తి అర్థమును తెలుపుతూ సమాపక క్రియతో కూడినది సామాన్యవాక్యము.

వ్యాసుడు భారతం రచించాడు. వ్యాసుడు భాగవతం రచించాడు. (దీనికి సంయుక్త వాక్యము ఏది) వ్యాసుడు భారతం మరియు భాగవతం రచించాడు. అశ్విని, జ్యోతి అక్కా చెల్లెంద్రు (ఏరకమైన వాక్యం) సామాన్య వాక్యం అంబేద్కర్ కార్యవాది మరియు క్రియాశీలి (సామాన్య వాక్యంగా మార్చుము) అంబేద్కర్ కార్యవాది. క్రియాశీలి

ప్రశ్నలు వాక్యాలు చెప్పే భావాన్ని విధానాన్ని బట్టి కొన్ని రకములుగా విభజించబడ్డాయి.

### వాక్య భేదాలు

1. ప్రశ్నార్థక వాక్యం : వాక్యంలో ప్రశ్నను సూచించే అర్థం ఉంటే అది ప్రశ్నార్థక వాక్యం.
ఉదా : 1) వారందరికీ ఏమైంది? 2) మీకు సహాయ పడిందెవరు?
2. ఆశ్చర్యార్థక వాక్యం : వాక్యంలో ఆశ్చర్యానికి సంబంధించిన అర్థం ఉంటే దానిని ఆశ్చర్యార్థక వాక్యం అంటారు.
ఉదా : 1) ఆహా ! ఎంత బాగుంది! 2) ఓరిబాబోయ్ ! పన్నెండు లక్షలే !
3. హేత్వర్థక వాక్యం : హేతువు (కారణాన్ని) అర్థాన్ని సూచించేది. వాక్యం మొదటి భాగంలో కారణాన్ని సూచిస్తూ రెండవ భాగంలో దాని ఫలితాన్ని తెలిపేది.
ఉదా : 1) వర్షాలు లేక పంటలు పండలేదు. 2) వేణు చదవక ఫెయిలయ్యాడు.
4. నిషేధార్థక వాక్యం : ఏదైనా క్రియను నిషేధించినట్లయితే అది నిషేధార్థక వాక్యం.
ఉదా : 1) మీరు అల్లరిచేయ్యవద్దు 2) మీరు బయట తిరిగవద్దు
5. విధ్యర్థక వాక్యం : తప్పనిసరిగా చేయవలసిన పనిని సూచించేది.
ఉదా : 1) మీరు చదవండి. 2) మీరు వ్రాయండి.
6. అనుమత్యర్థకం : ఒక పనిని చేయడానికి అనుమతి ఇచ్చే అర్థాన్ని సూచించే వాక్యం.
ఉదా : 1) మీరు ఆటలు ఆడవచ్చు 2) నీవ్వు పరీక్ష వ్రాయవచ్చు
7. ప్రార్థనార్థకం : ఒక పని చేయమని ప్రార్థిస్తున్నట్లు అర్థం సూచించడం.
ఉదా : 1) దయచేసి నన్ను కాపాడు. 2) దయచేసి అనుమయతించండి.
8. నిశ్చయార్థకం : తప్పనిసరిగా జరిగి తీరుతుందని సూచించేది.
ఉదా : 1) నేను తప్పక వస్తాను 2) నేనురే పురాస్తాను
9. సందేహార్థక వాక్యం : వాక్యంలో క్రియ (పని) జరుగుతుందో, జరగదో అని అనుమానించడం.
ఉదా : 1) వారువెళ్ళవచ్చా 2) అలాజరిగిందా? లేదా?
10. ఆశీర్వార్థక వాక్యం : వాక్యంలో ఒక వ్యక్తిని ఆశీర్వదిస్తున్నట్లు అర్థాన్ని సూచించే వాక్యాలను ఆశీర్వార్థక వాక్యం అంటారు.
ఉదా : 1) నిండు నూరెళ్ళు వర్ధిల్లు 2) నీకు శుభం కలగాలి.
11. సామర్థ్యార్థక వాక్యం : ఒక వ్యక్తి యొక్క సమర్థతను గురించి తెలిపినట్లయితే అది సామర్థ్యార్థక వాక్యం.
ఉదా : 1) రవి పాడగలడు. 2) అనిల్ బాగా చదవగలడు.
12. అప్యర్థక వాక్యం : "అపి అనే ప్రత్యయం చేరడం వల్ల కలిగేది - తెలుగులో "ఇనా" ప్రత్యయం చేరుతుంది. ఒక వాక్యంలో రెండవ భాగానికి చెందిన కార్యం సఫలీకృతం కాకపోవడానికి కారణం చెప్పేది.
ఉదా : 1) వర్షాలు విచ్చినా చెరువు నిండలేదు 2) వర్షాలు కురిసినా పంటలు పండలేదు

### జాతీయాలు - వివరించుట

(ఇవి వివరిస్తే సరిపోతుంది. సొంతవాక్యాలు రాయనవసరంలేదు)

| | | |
|---|---|---|
| 1. | శ్రీరామరక్ష | : ఎల్లప్పుడూ రక్షించడం, అనే అర్థంలో వాడే జాతీయం. |
| 2. | గీటు రాయి | : స్వచ్ఛతను తెలిపేది లేదా ప్రమాణికం |
| 3. | కారాలు, మిరియాలు నూరడం | : కోపంతో మండి పడడం. |
| 4. | గ్రామోద్ధరణం | : గ్రామాన్ని బాగుచేయడం. |
| 5. | స్వస్తి వాచకం | : ముగింపు చెప్పడం. వదిలివేయడం. |
| 6. | కబంధ హస్తాలు | : తప్పించుకోలేనివి (ప్రమాదంతో కూడినవి). |
| 7. | రూపుమాపడం | : శాశ్వతంగా తొలగించడం. |
| 8. | సుగ్రీవాజ్ఞ | : తప్పనిసరిగా పాటించాల్సిన ఆజ్ఞ. |
| 9. | తునాతునకలు | : అనుకున్న పని భగ్నమవ్వటం, ముక్కలవడం, లేదా నాశనం కావడం. |
| 10. | కనువిప్పు | : పశ్చాత్తాపపడటం, నిజం తెలుసుకోవడం. |
| 11. | కాలధర్మం చెందడం | : మరణించడం. |
| 12. | అగ్రతాంబూలం | : ముందుగా గౌరవింపబడటం. |
| 13. | ఉలుకూపలుకూ లేకపోవడం | : స్పందించకపోవడం లేదా మాట్లాడకపోవడం. |
| 14. | నీరు కారి పోవడం | : నిరుత్సాహం పొందడం. |
| 15. | చెవిటి వాని ముందు శంఖం ఊదినట్లు | : వ్యర్థప్రయోజనం. |
| 116. | చెవినిల్లు కట్టుకొని పోరు | : పదే పదే చెప్పు. |
| 17. | భగీరథ ప్రయత్నం | : అత్యంత ప్రయత్నంతో సాధించిన పని. |
| 18. | పురిటిలోనే సంధికొట్టడం | : "పురిటి రోజుల్లోనే బిడ్డ మరణించడం లేదా పని మొదలు పెట్టగానే ఆ పనికి అడ్డంకి ఏర్పడి పని పాడవడం అనే సందర్భంలో" |
| 19. | మంత్రాలకు చింతకాయలు రాలడం | : సంబంధంలేనిదని చెప్పడానికి చెప్పే సందర్భంలో దీనిని వాడతారు. |
| 20. | గజ్జె కట్టడం | : ఒక పనిని సక్రమంగా ప్రారంభించటం. గజ్జెలుకట్టుకొని నాట్యం చేయడం. |
| 21. | కలుపు తీయడం | : చెడును తొలగించడం, బాగా ఉన్న పైరులోని పనికిరాని గడ్డి మొక్కలను తీసివేయడం. |
| 22. | గుండెలు బరువెక్కడం | : మనసుకలతపడటం, మనస్సుకు భారంగా ఉన్న విషయాలు విన్నప్పుడు. |



23. మిన్నందు కోవడం : సంతోషంతో ఉప్పొంగిపోవటం. ఆకాశాన్ని అందుకోవటం.
24. చిందులు వేయడం : కోపంతో మండిపడటం, ఆనందంతో గంతులు వేయడం.
25. ఉచితజ్ఞత : తగిన విషయాన్ని తెలుసుకొనడం లేదా సందర్భానుసారం ప్రవర్తించడం.
26. స్థిత ప్రజ్ఞత : దేనికీ చలింపని మనస్తత్వము.
27. పితృవాక్య పరిపాలన : తండ్రి మాటను తప్పకుండా పాటించడం.
28. గతజలసేతు బంధనం : వ్యర్థమైన ప్రయత్నాలు, నీరు పోయిన తరువాత అడ్డుకట్ట వేసినట్లు.
29. బ్రహ్మాస్త్రం : తిరుగులేని అస్త్రము, బ్రహ్మగారి అస్త్రమువలె.
30. అగస్త్యభ్రాత : పేరు లేని వాడు కాబట్టి అన్నగారిని బట్టి వ్యవహరించేవాడు.
31. చెప్పుడుమాటలు : ఇతరుల మీద లేనిపోని మాటలు (చాడీలు) చెప్పడం.
32. చూసిరమ్మంటే కాల్చిరావడం. : పనిచేయమని చెప్పితే పాడు చేసుకొని రావడం.

18, 19, 20 : ప్రశ్నలు

**సొంత వాక్యాలు - వాక్య ప్రయోగం**

1. కడుపులు మాడ్చుకొను : (పస్తులుండటం) మా తల్లిదండ్రులు కడుపులు మాడ్చుకొని మమ్మల్ని చదివిస్తున్నారు.
2. చమత్కారం : చమత్కారంగా, మాట్లాడేవారిని అందరూ ఇష్టపడతారు.
3. పొద్దస్తమానం : రైతులు పొద్దస్తమానం పొలాల్లోపని చేస్తారు.
4. సాన్నిధ్యం : (సమీపం) మా అమ్మ ఎప్పుడూ దేవునిసాన్నిధ్యంలో కాలం గడుపుతుంది.
5. కష్టఫలం : (శ్రమకు తగిన ఫలితం) నేడు రైతులకు తమ కష్ట ఫలం దక్కట లేదు.
6. అడుగున పడిపోవు : (కనిపించకుండా పోవడం) ప్రభుత్వం శ్రద్ధ తీసుకోకపోవడం వల్ల మాగ్రామాభివృద్ధి అడుగునపడిపోయింది.
7. చివాట్లు పెట్టడం : (చేసిన తప్పుకుమందలించడం) నేను బడికి ఆలస్యంగా వస్తున్నానని ఉపాధ్యాయులు నాకు చివాట్లు పెట్టారు.
8. శ్రద్ధాసక్తులు : మనం చేసే పనిపై శ్రద్ధాసక్తులు లేనిదే విజయం సాధించలేం.
9. ఆయత్తమవడం : (సిద్ధమవడం) నేను పరీక్షలకు బాగా చదివిరాయడానికి ఆయత్తమవుతున్నాను.
10. సమయసందర్భాలు : (అనాలోచితం) కొంతమంది సమయ సందర్భాలు లేకుండా మాట్లాడరాదు.
11. [illegible] : [illegible]
12. కలవరపడటం : [illegible]
13. కనువిప్పు : ఉపాధ్యాయులు చెప్పిన [illegible] కనువిప్పు కలిగింది.
14. [illegible] : [illegible] ప్రయత్నించాలి.

15. లాలన : తల్లిదండ్రులు తమ పిల్లలను లాలనచేసి పెంచాలి.
16. మిన్నందుకోవడం : మన ప్రధాని కీర్తి ప్రతిష్ఠలు, దేశ విదేశాలలో మిన్నందుకొన్నాయి.
17. మైత్రి : దుర్జనులతో మైత్రి చేయవద్దు
18. వన్నెచిన్నెలు : అప్సరసలు తమ వన్నెచిన్నెలతో దేవేంద్రుని అలరించారు.
19. ప్రేమ, ఆప్యాయతలు : తల్లిదండ్రులు తమ పిల్లల పట్ల ప్రేమ, ఆప్యాయతలు ప్రదర్శించాలి.
20. శ్రీరామరక్ష : ధీమంతులకు ఆత్మ స్థైర్యమే శ్రీరామరక్షగా ఉంటుంది.
21. గీటురాయి : ఎన్నికలు ప్రజాభిప్రాయానికి గీటురాయి.
22. స్వస్తి వాచకం : పురోహితులు, భక్తులకు స్వస్తి వాచకం పలుకుతారు.
23. రోమాంచితం : మనదేశం క్రికెట్ ఆటలో ప్రపంచకప్ సాధించినదని విని నాకు రోమాంచితం అయ్యింది.
24. కారాలు మిరియాలు నూరడం : పాలకపక్షం, విపక్షం, ఎప్పుడూ ఒక దానిపై మరొకటి కారాలు, మిరియాలు నూరుకొంటాయి.
25. గుండెలుబరువెక్కడం : నా ప్రియమిత్రుడు కాలధర్మం చెందాడని తెలిసి నా గుండెలు బరువెక్కాయి.
26. హాయి సౌఖ్యాలు : ప్రతిఫలాపేక్ష లేకుండా సేవ చేయువానికి జీవితంలో హాయి సౌఖ్యాలు కలుగుతాయి.

1. కర్తరి వాక్యం : కర్త ప్రధానంగా గలది కర్తరివాక్యం. కర్తరి వాక్యంలో కర్త ప్రథమా విభక్తిలోనూ, కర్మ ద్వితీయా విభక్తిలోనూ(ను) ఉంటుంది.
2. కర్మణి వాక్యం : కర్మ ప్రథమా విభక్తిలో ఉంటుంది. కర్త ప్రక్కన తృతీయా విభక్తి ప్రత్యయం (చేత) చేరుతుంది. క్రియ ప్రక్కన బడుచేరుతుంది.
   1. వాల్మీకి రామాయణాన్ని రచించారు. (కర్మణివాక్యం) వాల్మీకిచే రామాయణం రచింపబడింది
   2. చిత్రగ్రీవముచే ఎగురుట తెలియబడెను. ( కర్తరి వాక్యం) చిత్రగ్రీవానికి ఎగురుట తెలిసింది.
3. ప్రత్యక్ష కథనం : ఉత్తమ పురుష కథనంతో, నేరుగా చెప్పదల్చుకున్న అంశాలను ఉద్ధరణ చిహ్నాలు (ఇన్వర్టెడ్ కామాలు) ఉంచి చెప్పి తదనంతరం "అని" అనే కారకం చేర్చి వాక్యాన్ని పూర్తిచేసినట్లయితే దానిని ప్రత్యక్ష కథనం అంటారు.
4. పరోక్షకథనం : సందర్భానుసారంగా పురుషను మార్చి పరోక్షంగా చెప్పి, ఉద్ధరణ చిహ్నాలులేకుండా "అని" అనే అనుకారకాని వాక్యంలో కలిపి చెప్పినట్లయితే దానిని పరోక్షకథనం అంటారు.
   (ప్రత్యక్ష కథనంలోని నేను, మేము వంటివి పరోక్ష కథనంలో రాసేటప్పుడు తను, తమ, తాను, తాముగాను, నీవు, మీరు గాను లేదా అతడు, ఆమె, వారుగా మారుతాయి)

ప్రత్యక్ష కథనాలు :

1. తనకు చాలా ముఖ్యమైన పనియుందని రాము అన్నాడు
   "నాకు చాలా ముఖ్యమైన పని ఉంది" అని రాము అన్నాడు.
2. సుందరకాండ చదువమని నాకు ఉపాధ్యయుడు చెప్పాడు
   సుదందరకాండ చదువుము" అని నాకు ఉపాధ్యాయుడు చెప్పాడు.

